#  అమ్మవారికి బలి సమర్పించే విధానం 

1. **పాయస బలి:-** పాయసాన్ని అమ్మవారి ముందు పెట్టి మూల మంత్రాన్ని మనస్సులో చెప్పుకుని సర్వోపద్రవ నివారణార్థం, సర్వాభీష్ట సిద్ధ్యర్థం శ్రీ మహాకాళీ శ్రీ మహాలక్ష్మీ శ్రీ మహా సరస్వతీ స్వరూపిణీ శ్రీ జగదాంబాయై నమః పాయసబలిం సమర్పయామి అని ఉద్ధరిని తో నీటిని పాయసం పై వేయాలి.

2. **నారికేళ బలి:-** టెంకాయకు శిఖ తీసివేసి చుట్టూ కుంకుమ రాసి అమ్మవారి మూల మంత్రాన్ని మనస్సులో చెప్పుకుని పగలకొట్టాలి. తర్వాత టెంకాయ లోపల భాగంలో కూడా కుంకుమ రాసి అమ్మవారి ముందు పెట్టి మూల మంత్రాన్ని మనస్సులో చెప్పుకుని సర్వోపద్రవ నివారణార్థం, సర్వాభీష్ట సిద్ధ్యర్థం శ్రీ మహాకాళీ శ్రీ మహాలక్ష్మీ శ్రీ మహా సరస్వతీ స్వరూపిణీ శ్రీ జగదాంబాయై నమః నారికేళ బలిం సమర్పయామి అని ఉద్ధరిని తో నీటిని టెంకాయ చిప్పలపై విడవాలి. **(టెంకాయ పగలగొట్టినప్పుడు క్రిందపడిన నీటిని ఎవ్వరూ కూడా తొక్కకుండా బలి సమర్పణ అయిన వెంటనే శుభ్రంగా తుడవాలి)**

3. **జంభీర బలి (నిమ్మకాయ):-** మూల మంత్రాన్ని మనస్సులో చెప్పుకుని నిమ్మకాయను కత్తితో కోసి లోపల భాగంలో కుంకుమ రాసి మూల మంత్రాన్ని మనస్సులో చెప్పుకుని సర్వోపద్రవ నివారణార్థం, సర్వాభీష్ట సిద్ధ్యర్థం శ్రీ మహాకాళీ శ్రీ మహాలక్ష్మీ శ్రీ మహా సరస్వతీ స్వరూపిణీ శ్రీ జగదాంబాయై నమః జంభీరబలిం సమర్పయామి అని అమ్మవారి పాదాల వద్ద ఉంచాలి. మరొక నిమ్మకాయ తీసుకొని మూల మంత్రాన్ని మనస్సులో చెప్పుకుని నిమ్మకాయను కత్తితో కోసి లోపల భాగంలో కుంకుమ రాసి రెండు చేతులు క్రాస్ చేసి (రెండు చేతులను ఇంటూ మార్క్ లాగ) మూల మంత్రాన్ని మనస్సులో చెప్పుకుని సర్వోపద్రవ నివారణార్థం, సర్వాభీష్ట సిద్ధ్యర్థం శ్రీ మహాకాళీ శ్రీ మహాలక్ష్మీ శ్రీ మహా సరస్వతీ స్వరూపిణీ శ్రీ జగదాంబాయై నమః జంభీర రక్త తర్పణం సమర్పయామి అని పిండాలి. **(నిమ్మకాయ పిండేటప్పుడు నిమ్మరసం క్రింద భూమిపై పడకుండా క్రింద పాత్ర పెట్టుకోవాలి.)**

4. **కూష్మాండ బలి:-** బూడిద గుమ్మడికాయ కు పై భాగం అంతా కుంకుమ రాసి అమ్మవారి ఎదురుగా పీఠపై ఎర్రని వస్త్రం పరచి ఉంచి సాధకుడు ఉత్తర ముఖంగా నిలబడి లేదా కూర్చొని గుమ్మడి కాయలు గంధం కుంకుమ బొట్లు అలంకరించి మూల మంత్రాన్ని మనస్సులో 11 సార్లు చెప్పుకుని ఖడ్గంతో ఒకేవేటు తో నరకాలి. తర్వాత గుమ్మడి కాయ రెండు భాగాలకు లోపల భాగంలో కుంకుమ రాసి అమ్మవారి ముందు పాత్రల్లో పెట్టి మూల మంత్రాన్ని మనస్సులో చెప్పుకుని సర్వోపద్రవ నివారణార్థం, సర్వాభీష్ట సిద్ధ్యర్థం శ్రీ

మహాకాళీ శ్రీ మహాలక్ష్మీ శ్రీ మహా సరస్వతీ స్వరూపిణీ శ్రీ జగదాంబాయై నమః కూష్మాండబలిం సమర్పయామి అని ఉద్ధరిని తో నీటిని గుమ్మడి కాయ భాగాలపై వేయాలి.

5. **కూష్మాండ బలి (పరివార దేవతలకు):-** అమ్మవారి ఎదురుగా పీఠంపై ఎర్రని వస్త్రం పరచి బూడిద గుమ్మడికాయ కు పై భాగం అంతా గంధం, కుంకుమ రాసి సాధకుడు ఉత్తర ముఖంగా నిలబడి లేదా కూర్చుని మూల మంత్రాన్ని మనస్సులో 11 సార్లు చెప్పుకుని ఖడ్గంతో ఒకేవేటు తో నరకాలి. తర్వాత గుమ్మడి కాయ రెండు భాగాలకు లోపల భాగంలో కుంకుమ రాసి వాటిలో ఒక భాగాన్ని అమ్మవారి ముందు పెట్టి మూల మంత్రాన్ని మనస్సులో చెప్పుకుని సర్వోపద్రవ నివారణార్థం, సర్వాభీష్ట సిద్ధ్యర్థం శ్రీ మహాకాళీ శ్రీ మహాలక్ష్మీ శ్రీ మహా సరస్వతీ స్వరూపిణీ శ్రీ జగదాంబాయై నమః కూష్మాండబలిం సమర్పయామి అంటూ ఉద్ధరిణీ తో నీటిని గుమ్మడి కాయ భాగంపై వేయాలి. తర్వాత మిగిలిన సగం భాగాన్ని రెండు భాగాలు చేయాలి. అందులో ఒక భాగానికి లోపల వైపు కుంకుమ బాగా పూయాలి . అమ్మవారి ముందు పెట్టి మూల మంత్రాన్ని మనస్సులో చెప్పుకుని సర్వోపద్రవ నివారణార్థం, సర్వాభీష్ట సిద్ధ్యర్థం పరివార దేవతా సహిత శ్రీ మహాకాళీ శ్రీ మహాలక్ష్మీ శ్రీ మహా సరస్వతీ స్వరూపిణీ శ్రీ జగదాంబాయై నమః బలిం సమర్పయామి అని ఉద్ధరినీ తో నీటిని గుమ్మడి కాయ భాగంపై వేయాలి. తర్వాత మిగిలి ఉన్న ఒక భాగానికి కూడా లోపల వైపు కుంకుమ బాగా పూయాలి. తర్వాత ఇంటి బయటకు తీసుకుని వచ్చి కాగితంపై గుమ్మడి కాయ భాగం పెట్టి మూల మంత్రాన్ని మనస్సులో చెప్పుకుని సర్వోపద్రవ నివారణార్థం, సర్వాభీష్ట సిద్ధ్యర్థం పరివార దేవతా సహిత శ్రీ మహాకాళీ శ్రీ మహాలక్ష్మీ శ్రీ మహా సరస్వతీ స్వరూపిణీ శ్రీ జగదాంబా ప్రీత్యర్థం భూతబలిం సమర్పయామి అని ఉద్ధరీనీ తో నీటిని గుమ్మడి కాయ భాగం పై వేయాలి. **(భూత బలి పెట్టిన దానిని ఎట్టి పరిస్థితుల్లోనూ తాకకూడదు.)**

6. **రక్తాన్న బలి:-** ప్రథమంగా వండుకున్న అన్నంలో ఆవునెయ్యి, కుంకుమ వేసి ముద్దగా చేసి అమ్మవారి ముందు పెట్టి మూల మంత్రాన్ని మనస్సులో చెప్పుకుని సర్వోపద్రవ నివారణార్థం, సర్వాభీష్ట సిద్ధ్యర్థం శ్రీ మహాకాళీ శ్రీ మహాలక్ష్మీ శ్రీ మహా సరస్వతీ స్వరూపిణీ శ్రీ జగదాంబాయై నమః రక్తాన్న బలిం సమర్పయామి అని ఉద్ధరిని తో నీటిని ముద్దపై విడవాలి. **(రక్తాన్నాన్ని భూతబలిగా కూడా పెట్టవచ్చు)**

# కూష్మాండ బలి సంక్షిప్తంగా...

ఆచమనం, ప్రాణాయామం చేయాలి. తర్వాత **మమ సహ కుటుంబస్య సర్వాపన్నివృత్తి, సర్వారిష్ట శాంతి , సర్వాభీష్టసిద్ధి కల్పోక్త ఫలవాప్తి ద్వారా శ్రీమహాకాళీ శ్రీ మహాలక్ష్మీ శ్రీ మహా సరస్వతీ స్వరూపిణీ శ్రీ జగదంబా ప్రీత్యర్థం కూష్మాండ బలిదానం కరిష్యే.** అని సంకల్పం చెప్పుకోవాలి.

శ్రీ విఘ్నేశ్వరున్ని , గురువుని ధ్యానించి తర్వాత అమ్మవారికి మూల మంత్రంతో  పంచోపచార పూజ చేయాలి.

తర్వాత అమ్మవారి ఎదురుగా ఒక పీఠంపై ఎర్రని వస్త్రం పరచి దానిపై బూడిద గుమ్మడికాయను ఉంచి (గుమ్మడి కాయ తొడిమ అమ్మవారి వైపు ఉండాలి.) , సాధకుడు ఉత్తర ముఖంగా నిలబడి లేదా కూర్చుని  బూడిద గుమ్మడికాయకు గంధం , కుంకుమలతో అలంకరించి **ఓం కూష్మాండ బలియే నమః** అనే మంత్రంతో ఆవాహన, వస్త్ర, గంధ,నైవేద్య,నీరాజనం పూజ చేయాలి.

తర్వాత  ఈ క్రింది శ్లోకం చదవాలి.

**ఓం పశుస్త్వం బలిరూపేణ మమ భాగ్యాదవస్థితః**

**ప్రణమామి తత స్సర్వరూపిణం బలిరూపిణం**

**చండికా ప్రీతిదానేన దాతురాప ద్వినాశనం**

**చాముండా బలిరుపాయ బలేతుభ్యం నమోస్తుతే**

**యజ్ఞార్థం బలయ స్సృష్టాః స్వయమేవ స్వయంభువ**

**అతస్త్వాం ఘాతయామద్య యస్మాద్యజ్ఞే వధోవధః**

తర్వాత ఖడ్గానికి గంధం , కుంకుమలతో అలంకరిస్తూ **ఓం ఐం హ్రీం శ్రీం రసనాత్వం చండికాయాః సర్వలోక ప్రసాదకః** అనే మంత్రంతో అభిమంత్రించాలి.

తర్వాత **ఓం హ్రాం హ్రీం ఖడ్గ – ఆం హుం ఫట్** అంటూ ఖడ్గాన్ని చేతిలో పట్టుకోవాలి. పట్టుకున్న తర్వాత మళ్ళీ **ఓం హ్రాం హ్రీం ఖడ్గ – ఆం హుం ఫట్** మంత్రం చెప్పాలి.

తర్వాత   మూల మంత్రాన్ని మనస్సులో 11 సార్లు చెప్పుకోవాలి.

తర్వాత **ఓం కాళి కాళి - వజ్రేశ్వరి లోహదండాయై నమః** అని చెప్పి ఖడ్గంతో ఒకే వేటుతో గుమ్మడికాయను నరకాలి.

తర్వాత తెగిన రెండు భాగాలకు లోపలి వైపు కుంకుమ రాసి అమ్మవారి ముందు రాగిపత్ర లేదా విస్తరాకుపై పెట్టి మూల మంత్రాన్ని  మనస్సులో చెప్పుకుని **మహాకాళీ శ్రీ మహాలక్ష్మీ శ్రీ మహా సరస్వతీ స్వరూపిణీ శ్రీ జగదాంబాయై నమః కూష్మాండ బలిం సమర్పయామి** అని ఉద్ధరిని తో నీటిని గుమ్మడి కాయ భాగాలపై వేయాలి.

ఒకవేళ పరివార దేవతలకు కూడా బలి సమర్పణ చేయాలి అని ఆలోచన వస్తే

గుమ్మడికాయను నరికిన తర్వాత రెండు భాగాల్లో ఒక భాగానికి (అమ్మవారి వైపు ఉన్న భాగానికి) లోపల భాగంలో కుంకుమ రాసి అమ్మవారి ముందు రాగిపాత్ర లేదా విస్తరాకుపై పెట్టి మూల మంత్రాన్ని మనస్సులో చెప్పుకుని **మహాకాళీ శ్రీ మహాలక్ష్మీ శ్రీ మహా సరస్వతీ స్వరూపిణీ శ్రీ జగదాంబాయై నమః కూష్మాండ బలిం సమర్పయామి** అని ఉద్ధరిణీ తో నీటిని గుమ్మడి కాయ భాగం పై వేయాలి.

తర్వాత మిగిలిన సగ భాగాన్ని రెండు భాగాలు చేయాలి.

ఆ రెండు భాగాల్లో ఒక భాగానికి కుంకుమ రాసి అమ్మవారి ముందు రాగిపాత్ర లేదా విస్తరాకుపై పెట్టి **పరివార దేవతా సహిత మహాకాళీ శ్రీ మహాలక్ష్మీ శ్రీ మహా సరస్వతీ స్వరూపిణీ శ్రీ జగదాంబాయై నమః బలిం సమర్పయామి** అని ఉద్ధరినీ తో నీటిని గుమ్మడి కాయ భాగం పై వేయాలి.

ఇక మిగిలిన ఒక భాగానికి కూడా కుంకుమ రాసి ఇంటి బయటకు తీసుకుని వచ్చి కాగితంపై , లేదా విస్తరాకుపై గుమ్మడి కాయ భాగం పెట్టి మూల మంత్రాన్ని మనస్సులో చెప్పుకుని **పరివార దేవతా సహిత మహాకాళీ శ్రీ మహాలక్ష్మీ శ్రీ మహా సరస్వతీ స్వరూపిణీ శ్రీ జగదంబా ప్రీత్యర్థం భూతబలిం సమర్పయామి** అని ఉద్ధరినీ తో నీటిని గుమ్మడి కాయ భాగం పై వేయాలి. తర్వాత కాళ్లు కడుక్కొని ఇంట్లోకి రావాలి. **(భూతబలి సమర్పణ చేసిన తర్వాత ఎట్టి పరిస్థితుల్లోనూ భూతబలి భాగాన్ని తాకకూడదు)**

గమనిక. :- **దేవతకు సమర్పించిన బలిని మనం ప్రసాదంగా తీసుకోకూడదు. పూజానంతరం ఇంటి బయటఎవరూ తొక్కని చోట విడిచిపెట్టాలి. లేదా పారే నీటిలో వదిలేయాలి. అలాగే బలి సమర్పణ అయిన తర్వాత బలి యొక్క విత్తనాలు, నీరు , బలి పదార్థం కింద పడినప్పుడు వాటిని కాలితో తొక్కకూడదు. వెంటనే శుభ్రం చేసుకోవాలి.**

.